## గ్రామోద్యోగుల పిల్లలకు విద్య

### సౌకర్యాలు కావాలని విజ్ఞప్తి

కొండపల్లి, ఏప్రిల్ 14: గ్రామోద్యోగులకు చిన్న గుమాస్తాల పద్ధతిలో జీతాలిప్పించి, స్కూల్ ఫైనల్ వరకు వారి పిల్లలకు ఉచిత విద్యాబోధన సౌకర్యం, విశ్వవిద్యాలయ విద్య సగం ఖర్చుతో చెల్లించే పద్ధతిలోను ఏర్పాటుచేయమని ప్రభుత్వాన్ని కోరుతూ ఇటీవల ఇక్కడ జరిగిన సమావేశంలో కొండపల్లి ఫిర్కా గ్రామోద్యోగులు తీర్మానించారు. సమావేశానికి శ్రీ వై. పట్టాభిరామయ్య అధ్యక్షత వహించారు.

సర్ ఛార్జిలెక్కలు, వోటర్ల జాబితాలవంటి వాటిని తయారుచేయడానికి ప్రత్యేక సిబ్బందిని నియమించమని ఒక తీర్మానంలో ప్రభుత్వాన్ని కోరారు. ఫిర్కా ప్రధాన కేంద్రానికి, తాలూకా ప్రధాన కేంద్రానికి గ్రామోద్యోగులను అధికారులు పిలిపించినప్పుడల్లా మైలేజి పద్ధతిలో ప్రయాణభత్యం ఇప్పించమని కోరారు. జమీ ప్రాంత గ్రామోద్యోగులకు కూడా ప్రభుత్వ అజమాయిషీలోని గ్రామోద్యోగులతో సమానంగా జీతాలు ఇప్పించమని ప్రభుత్వాన్ని కోరుతూ మరొక తీర్మానం చేశారు.

## అఖిలభారత ఆర్యవైశ్య మహాసభలు

25 వ అఖిలభారత ఆర్యవైశ్య మహాసభలు 1956 వ సంవత్సరం, ఏప్రియలు, 28, 29 వ తేదీలలో శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ అమ్మవారి జన్మస్థానమైన పశ్చిమ గోదావరి జిల్లాలోని పెనుగొండ క్షేత్రమున జరుగును. అనుబంధ మహాసభలుగూడ జరుపబడును. యావద్భారతములోని వైశ్య మహాజనులు యీ మహాసభలకు విచ్చేసి సభలను జయప్రదము చేయవలసిందిగా ప్రార్థించుచున్నాము. "పెనుగొండ చేరుటకు తాడేపల్లిగూడెం లేక నిడదవోలు రైల్వేస్టేషనులో దిగవలెను."

ఆహ్వానసంఘము
తాడా వెంకటరత్నం, జనరల్ కార్యదర్శి
పెనుగొండ, 9-4-56.



# ప్రకాశం హయాంలో రాయలసీమకు మేలు

## చాపాడుకాల్వ రైతు సభలో ఉపముఖ్యమంత్రి వివరణ

ప్రొద్దుటూరు, ఏప్రిల్ 15: "ప్రకాశం ప్రభుత్వం హయాములో, శాసనసభలో తగిన సంఖ్యాబలం లేనందువల్ల ప్రభుత్వం ఎప్పుడు పడిపోతుందో నన్న ఆతురతో కొద్ది ప్రజోపయోగమైన పనులన్నీ త్వరత్వరగా చేయాలని పట్టుదలతో చేశాము. లోటు బడ్జెట్ అయినా కేంద్రప్రభుత్వంవద్ద అప్పుతెచ్చి, 18 ప్రాజెక్టుల నిర్మాణానికి పూనుకొన్నాము. రాయలసీమలో సగిలేరు, పింఛ, కర్నూలు కడప కాల్వ విస్తరణ, తుంగభద్ర ఎగువకాల్వ మొదలైన పథకాలనేకం ప్రారంభించాము" అని ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి చాపాడు ఛానల్ అభివృద్ధి సమావేశంలో ప్రసంగిస్తూ, రాయలసీమలో అమలుజరుపుతున్న కార్యక్రమాలను వివరించారు.

"ప్రజలు తమ యిబ్బందులను నేరుగావచ్చి ప్రభుత్వానికి తెలుపుకొనటానికి వీలుగా కర్నూలులో రాజధాని ఏర్పాటు చేశాము. ఎందరో మహానుభావులు ప్రయత్నించి సాధించలేని, విశ్వవిద్యాలయాన్ని తిరుపతిలో యేర్పాటు చేశాము. జిల్లా జిల్లాలోను చిన్నచిన్న ప్రాజెక్టులు అమలు జరుపుతున్నాం" అని ఆయన అన్నారు.

ఈ సభకు అధ్యక్షత వహించిన శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు మాట్లాడుతూ, శ్రీ సంజీవరెడ్డికి ప్రాంతీయాభిమానం పక్షపాతం లేదని, ఆయనను రాయలసీమ పక్షపాతి అని విమర్శించడం సబబైన పని కాదని అన్నారు. "శ్రీ సంజీవరెడ్డి, వెనుకబడిన ప్రాంతం పక్షపాతి, పేదతనంచూచి సహించలేని పక్షపాతి; అన్యాయం సహించలేని పక్షపాతి" అని అభివర్ణించారు.

రాయలసీమలో రు 20 కోట్ల నీటివనరుల పథకాలు, కృష్ణా గుంటూరు గోదావరి జిల్లాలకు, నాగార్జునసాగరం, శ్రీకాకుళం జిల్లాకు వంశధారవగైరా, నీటివనరుల పథకాలను సాధించగలిగిన ధీరుడు శ్రీ సంజీవరెడ్డి అని శ్లాఘించారు.

ఈ సభకు కడపజిల్లా శాసనసభ్యులు శ్రీయుతులు వరాల శంభురెడ్డి, వై. ఆదినారాయణరెడ్డి, బసిరెడ్డి, బి. రామారెడ్డి సూపరింటెండెంటు ఇంజనీరు, పి. డబ్ల్యు. డి. అసిస్టెంటు ఇంజనీరు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు కడపజిల్లా కలెక్టరు, కడపజిల్లా పోలీసు సూపరింటెండెంటు తదితర జిల్లాప్రముఖులు వచ్చారు.

చాపాడుకాల్వ అభివృద్ధిసంఘం తరఫున శ్రీ మదూరు చలపతిరావు ఉపముఖ్యమంత్రికి వినతిపత్రం సమర్పించారు. చాపాడుకాల్వను విస్తృతం చేయాలని అందులో కోరారు. మోడమీదిపల్లె యేటికాల్వ ఇరిగేషన్ పంచాయతీ వారు ఉపముఖ్యమంత్రికి సమర్పించిన వినతిపత్రంలో, కొత్తయేటిపల్లె కాల్వకు తలపరివద్ద రెండువరుసలు రాతికట్టడం కట్టాలని, రామేశ్వరం పడమటితట్టు ఉత్తర దక్షిణపు కాల్వకు అడుగుభాగాన కాంక్రీటుగాని, లేదా కడపరాళ్ళను పరిపించుటగాని చేయాలని రామేశ్వరం గ్రామంలో కాల్వకు యిరుప్రక్కల ఆక్రమణలు తొలగించాలని, కోరారు.

ప్రొద్దుటూరు నీలిరంగు ఉత్పత్తి విక్రయదార్ల సంఘం, నీలిపంట పునరుద్ధరణ విషయంలో ప్రభుత్వం తగు శ్రద్ధ తీసుకొని విదేశీరంగుల దిగుమతి అరికట్టాలని కోరారు.

చేనేత, నిమ్నజాతుల సమాఖ్య తరఫున శ్రీ జింకా వెంకటసుబ్బయ్య ఒక వినతిపత్రాన్ని సమర్పిస్తూ ధోవతులు చీరలు చేనేతకు కేటాయించాలని, నిమ్నజాతుల వారికి ఉద్యోగాలు కేటాయించాలని కోరారు.

### సంజీవరెడ్డికి పక్షపాతంలేదు

సభాధ్యక్షులు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు తమ అధ్యక్షోపన్యాసంలో యిలా చెప్పారు:

"కాంగ్రెసు ప్రభుత్వం రైతుల దుస్థితి తెలుసుకొనగలిగింది. కోస్తా జిల్లాల పరిస్థితికి రాయలసీమ పరిస్థితికి చాలా తేడాఉంది. ప్రొద్దుటూరు పరిస్థితులు కొంచెం మెరుగు.

శ్రీ సంజీవరెడ్డియే ప్రాంతానికి కావలసిన సౌకర్యాలు ఆ ప్రాంతంలో కలుగజేస్తున్నారు. రాయలసీమను సశ్యశ్యామలం చేయగలిగిన 20 కోట్ల రూపాయల వ్యయంతో ప్రాజెక్టులు, వంశధార ప్రాజెక్టు, శ్రీకాకుళం జిల్లాలోని ప్రాజెక్టుల నిర్మాణానికి కేంద్రప్రభుత్వాన్ని ఒప్పించగలిగారు."

"చాపాడు చానలు అభివృద్ధి విషయంలో చాలా కాలంనుంచి మంత్రులతోనూ, ఉద్యోగులతోను శ్రీ బాలనారాయణరెడ్డిలో సంప్రదించుచున్నారు. యీ విషయం శ్రీ సంజీవరెడ్డి చాపాడు చానలు రాజోలు దగ్గర పరిశీలించి ఉద్యోగులతో విస్తృతంగా విషయంలో యేమి చేయాలో సంప్రదించారు. పని త్వరలోనే ప్రారంభమవుతుంది. ఆంధ్రదేశంలో ఒక ప్రాజెక్టు నిర్మింపబడిందంటే అగౌరవం

ఆంధ్రులందరికీ కలుగుతుంది. ఇప్పుడు తలపెట్టిన ప్రాజెక్టులముందు యీ చానలు అభివృద్ధి పథకం చాలా చిన్నది."

### ప్రజలు తోడ్పడాలి

"ప్రభుత్వ పథకాలకు ప్రజలు తోడ్పడాలి, శ్రమదానం చేయండి. మీరు అభివృద్ధి చెందండి. డబ్బు దాచుకో వద్దు. న్యాయమైన వడ్డీకి ప్రభుత్వానికి అప్పుగా యివ్వండి. ప్రజల సౌకర్యం కొరకు వినియోగపడుతుంది. పునర్నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొనడమే యీనాటి దేశభక్తి. దేశంలో నిరుద్యోగం నిర్మూలం కావాలి. కష్టించే వారికి తిండి, కట్టుగుడ్డలు నివసించేందుకు వసతి, కలుగజేయాలి. అప్పుడే స్వరాజ్యానికి అర్థం పొసగుతూ సమాజం నిర్మింపబడుతుంది."

ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి యిలా ప్రసంగించారు:

### రాయలసీమలో ప్రాజెక్టులు

"గత ఎన్నికలలో కాంగ్రెసుపార్టీకి శాసనసభలో తక్కువ సంఖ్యాబలమున్నప్పుడు శ్రీ ప్రకాశం పంతులుగారిని ముఖ్యమంత్రిపదవికి అంగీకరింపజేశాము. శాసనసభలో సంఖ్యాబలం లేకపోవడం మూలంగా, మంత్రివర్గం నిలవదనే భయంవల్ల, ఉన్న కొద్దికాలంలోనే ప్రజోపయోగమైన పనులు చేయాలని సంకల్పించుకున్నాము. స్వరాష్ట్రం రాగానే మునుపటి ఆంధ్రుల పరిస్థితి మార్చ సంకల్పం కలిగింది. అందులోను లోటుబడ్జెటు. కేంద్ర ప్రభుత్వందగ్గర అప్పుతెచ్చి పనులు ప్రారంభించాము. 18 ప్రాజెక్టుల నిర్మాణానికి పూనుకున్నాము. సగిలేరు, పింఛానది ప్రాజెక్టుల నిర్మాణం, కె. సి. కెనాలు విస్తృతప్రణాళిక, తుంగభద్ర ఎగువ కాలువ నిర్మాణం రాయలసీమలో ప్రారంభింపబడినవి. విద్యుచ్ఛక్తి కార్యక్రమంకూడ 27 కోట్ల రూపాయల వ్యయంతో కొనసాగిస్తున్నాము. చాలామంది శాసనసభ్యులకు వెనుకబడిన ప్రాంతాలభివృద్ధి చేయాలనే పట్టుదల కలిగింది. రాజధాని దగ్గరగాయుంటే ప్రజలు తమ యిబ్బందులు తెలియజేసికో వీలవుతుందని కర్నూలులో రాజధాని యేర్పాటు చేశాము. యిదివరలో యెంతమంది మహానుభావులో ప్రయత్నించి సాధించలేని తిరుపతిలో విశ్వవిద్యాలయం స్థాపించగలిగాము. జిల్లా జిల్లాలోను చిన్నచిన్న ప్రాజెక్టుల పనులు జరుగుతున్నవి. గోదావరి, కృష్ణ నదీజలాలు కడపజిల్లాకు వచ్చే అవకాశం లేకపోవటం మూలంగా తుంగభద్ర నదీజలాలమీదనే ఆధారపడవలసివచ్చింది. తుంగభద్ర ప్రాజెక్టువల్ల బళ్ళారి, అనంతపురం, కడపజిల్లాలలో బంగారు పంటలు పండుతున్నవి. దీనిని దీనితోపాటు నాగార్జునసాగరంలో నిర్మాణానికి కేంద్రప్రభుత్వం అంగీకరించింది. కరువు రోజులలో రైతులు గంజికేంద్రాల కెగబాకి, ఉన్న భూములు అమ్ముకుని ఎలాగో ప్రాణాలు నిలుపుకున్నారు. అప్పట్లో శ్రీ నెహ్రూ కడపకువచ్చి రాయచోటి, కుర్రంకొండ వగైరా ప్రాంతాలలోని దుస్థితిచూచి చాలా విచారపడ్డారు. ఇట్టి కరువు కాటకాలను నిర్మూలించలేని ప్రభుత్వమున్నా ఒకటే లేకపోయినా ఒకటే. రైతులు గౌరవంగా జీవించడానికి ప్రభుత్వం సౌకర్యం కలిగించాలి. కంట్రోల్ రోజులలో లభించని ఆహారపదార్థాల కొరత ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సాధించకలిగారు. ప్రభుత్వ లెక్కల ప్రకారం యిప్పుడు ఆంధ్రలో 10 లక్షల టన్నుల ఆహారధాన్యాలు ఎక్కువ ఉత్పత్తి అయినవి.

### చాపాడు కాల్వక్రింద 20 వేల ఎకరాల సాగు

"రాజోలు దగ్గరనుండి చాపాడు కాలవకు తుంగభద్రనీరు వస్తోంది. కాలవ ఒడ్డు పడిపోవడం మూలంగా పూడిపోయింది. దాని మరమ్మతు చేయాలి. 100 ఎకరముల భూమి సాగు అయే భూముకింద 600 ఎకరముల భూమి సాగు చేసికొంటున్నారు. యిప్పటి 10 వేల ఎకరాల సాగుగాక, మరొక 10 వేల ఎకరముల భూమి సాగు చేయడానికి వీలుగా నీటి సౌకర్యం కలిగించవచ్చని ఇంజనీర్లు ఆశిస్తున్నారు. యీ కాలవకింద యింకా ఎక్కువ పంట పండించ అవకాశముంది. కాని ఎక్కువ పంట పండి డబ్బు ఎక్కువ వస్తే మారీలు కూడ ఎక్కువ అవుతాయన్న భయముంది. నీతిగా, సుఖంగా జీవించ అలవాటు చేసికోండి. లేకపోతే దేశంలో అరాచకం బయలు దేరుతుంది."

"చాపాడు చానలు అభివృద్ధి విషయంలో శ్రీయుతులు బాల నారాయణరెడ్డి, ద్రోణంరాజు రెడ్డి, యితర మిత్రులు నన్ను తరచు హెచ్చరిస్తున్నారు. శ్రీ బాల నారాయణరెడ్డికి ఉపన్యాసాల మీద మోజు లేదు. వారు పని చేయ సంకల్పించినా నిర్మాణ

యుతంగా, ఉపాయంగా మంత్రులు, అధికార్లతో సంప్రదిస్తుంటారు."

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డి సంజీవరెడ్డి శక్తి సామర్థ్యాలు, నిజాయితీ, సేవాతత్పరత విశదీకరిస్తూ చాపాడు చానలు అభివృద్ధి తప్పకుండా జరుగుతుందని హామీ యిచ్చారు.

సభకు పూర్వము శ్రీయుతులు సంజీవరెడ్డి, అల్లూరి సత్యనారాయణ రాజు, కాసు బ్రహ్మానందరెడ్డి గార్లను పూలతోట్టిలో పట్టణ ముఖ్య వీధులలో ఊరేగించి, సభామంటపం దగ్గర వదిలిపెట్టారు. ఉత్సవంలో అందరు కడప జిల్లా శాసన సభ్యులు, కాంగ్రెసు కార్యకర్తలు పాల్గొన్నారు. సభకు వేలాది ప్రజలు తాలూకా నలుమూలలనుండి వచ్చేరు.

మహాసభ యేర్పాటన్నీ శ్రీ బాల నారాయణ రెడ్డిగారి నాయకత్వాన చక్కగా చేయబడినవి.

### తీర్మానాలు

సభలో యీ దిగువ తీర్మానాలు ఏకగ్రీవంగా ఆమోదించారు. కె. సి. కాల్వవిస్తరణ ప్రణాళికలో చాపాడు కాల్వనుకూడా చేర్చినందుకు, ప్రభుత్వానికి సభవారు కృతజ్ఞత తెలిపారు.

చాపాడు కాల్వ మొదలైనచోటి నుండి సుమారు 4 ఫర్లాంగులు, పెద్ద తూమునుండి 3 మైళ్ళదూరము, యేటా పూడిపోతున్నందున ఆ ప్రదేశము న కాల్వకిరుపైపుల రాతికట్టడము కట్టాలనీ కాలువగర్భం సిమెంటు కాంక్రీటుచేసి మిగతా కాలువను, పిల్లకాల్వలను ప్రతిసంవత్సరం పూడికతీయించాలని ప్రభుత్వాన్ని కోరారు.

ఈ కాలువ 4, 6, 9, 14/1, 17/1 17/4 17/5 మైళ్ళవద్ద వర్షాకాలంలో కట్టలు తెగిపోతున్నందున, వర్షపునీరు కాల్వదాటిపోకుండా అండర్ టన్నెల్స్ కట్టించాలని కోరారు.

రాజోలివద్ద సాధ్యమైనంతవరకు ఆనకట్టను ఎత్తుచేయడానికి, వాటం లేటని పడిలేచే తలుపులను అమర్చి, మైదుకూరు మీదుగా పారుతున్న కర్నూలు కడప కాల్వకున్ను, యీ చాపాటి కాల్వకున్ను రాజోలివద్ద బావూసాగా నీరు విడిచే యేర్పాటు చేయవలసిందిగా అర్థించారు.

ప్రతిసంవత్సరం మే 31 లోపల కాల్వ మరమ్మతులు పూర్తిచేయుటకు నగైరా పూర్తిచేసి జూన్ 1 నుండి కాల్వకు నీరువదిలే యేర్పాటుచేయాలని కోరారు.



ఉయ్యూరు పాలిటెక్నిక్ విద్యార్థులు కళాశాల వార్షికోత్సవంలో ప్రదర్శించిన "కాళరాత్రి" నటవర్గం. కూర్చున్నవారు:—(ఎడమనుంచి) ఎ. అరుణాచలం, టి. యస్. లెనిన్, వై. మురళీకృష్ణమోహన్, కె. వి. శివప్రసాద్, కె. బాలకృష్ణమూర్తి, నిలబడినవారు:—డి. నాగేశ్వరరావు, ఎ. కృష్ణమోహన్, వి. శ్రీరామశర్మ, (కళాశాల కార్యదర్శి) యస్. గోపాలరావు, కె. నారాయణ



ఉగాదినాడు ఏలూరులో శ్రీ సామవేదం జానకి రామశర్మ తమ 'రత్నావళి' నాటికను ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డికి కృతి ఇచ్చారు.

# వాయిదా వ్యాపారంలో బట్వాడా కంట్రాక్టులు

## బదిలీ వ్యాపారస్తులకు హెచ్చరిక

న్యూఢిల్లీ, ఏప్రిల్ 17: ఫార్వర్డు కాంట్రాక్టుల (వాయిదా) చట్టంలోని నిబంధనలను, పత్తి, పత్తితో తయారుచేసే బట్టలూ, సన్నూలు, ఆహారానికి పనికివచ్చే తైల ధాన్యాలూ, నూనెలు, ముడి జనుము, సుగంధ ద్రవ్యాలు, పంచదార గోధుమలు, ఉలవలు, లక్క, (సీడ్‌లాక్) లక్క (షెల్లాక్) ఈ పదార్థాలకు వర్తింపజేసినందువల్ల, యీ సరుకులలో వాయిదా వ్యాపారపు కాంట్రాక్టులను పూర్తిగా నిషేధించడమో, లేక గుర్తించిన కొన్ని సంస్థలద్వారా మాత్రమే అది కొనసాగడానికి అనుమతించడమో జరిగింది. అయితే, యావద్భారతదేశంలోను గోధుమలు, ఉలవలూ, బొంబాయినగరంలో నూనెగింజలూ మినహా తక్కిన అన్ని సరుకులలోనూ, బదిలీ చేయడానికి వీలులేని ప్రత్యేక బట్వాడా కాంట్రాక్టులు మాత్రం స్వేచ్ఛగా చేసుకోవచ్చును. చట్టంలోని 18 (3) వ సెక్షనుకింద అవసరాన్ని బట్టి యీ కాంట్రాక్టులనుకూడా అదుపులోకి తేవడానికి కేంద్రప్రభుత్వానికి అధికారంఉంది.

అటు ప్రజలకూ ఇటు వ్యాపారస్తులకూ కూడా మంచిదనే ఉద్దేశ్యంతో యీ బదిలీ చేయడానికి వీలులేని ప్రత్యేక బట్వాడా కాంట్రాక్టుల విషయంలో న్యాయశాస్త్ర దృక్పథం ఏమిటో వివరించడం అవశ్యకమని ఫార్వర్డు మార్కెట్ల కమిషను అభిప్రాయ పడుతోంది. బదిలీ చేయడానికి వీలులేని ప్రత్యేక బట్వాడా కాంట్రాక్టుల ముఖ్య లక్షణాలేమిటంటే, ఒకటి, కొన్ని నిర్ణీత రకాల వస్తువుల క్రయవిక్రయాలకూ, ఆ సరుకును కొనుక్కొన్న వారికి నిజంగా బట్వాడాచేయడానికి కాంట్రాక్టులో అవకాశం కల్పిస్తూ నిబంధనలు ఉండాలి. క్రయం చేసిన వారి పేర్లూ, విక్రయం చేసినవారి పేర్లూ ఉండాలి. కాంట్రాక్టు ద్వారా గాని, అందుకు సంబంధించిన ఇతర పత్రాల ద్వారాగాని, ఏర్పడే బాధ్యతలను, లభించే హక్కులను ఇతరులకు బదిలీ చేయడానికి వీలులేదు.

ఫార్వర్డు కాంట్రాక్టుల (వాయిదా) చట్టం అమలుకు సంబంధించి, యింతవరకు ఎవరూ దావా పెట్టడంగాని, తీర్పులు చెప్పడంగాని జరగలేదు. అయితే, దీనిని పోలిన 1946 వ సంవత్సరపు అవసరవస్తువుల (తాత్కాలికాధికారాల) చట్టం అమలుకు సంబంధించిన కొన్ని సంఘటనలలో న్యాయస్థానాధిపతులు ఆ చట్టం నిబంధనలను నిర్వచిస్తూ వ్యాఖ్యానించడం జరిగింది. ఆ తీర్పులు ఫార్వర్డు కాంట్రాక్టుల (వాయిదా) చట్టంలో కలిపి చదివితే, బదిలీ చేయడానికి వీలులేని ప్రత్యేక బట్వాడా కాంట్రాక్టుల విషయంలో రెండు ముఖ్య నిబంధనలను అనుసరించవలసి ఉంటుందని స్పష్టమౌతుంది. ఒకటి, యీ కాంట్రాక్టు కింద సరుకును ఎవరు కొనుగోలు చేస్తారో ఆ వ్యక్తి పేరిటే బట్వాడా ఆర్డరు, లేక, రైల్వే రసీదు, లేక రవాణా బిల్లు జారీచేయాలి. ఆ వ్యక్తే సరుకును అప్పగించుకోవాలి. రెండు, కాంట్రాక్టు కిందగాని అందుకు సంబంధించిన ఇతర పత్రాలకింద గాని ఏర్పడిన బాధ్యతలను లేదా హక్కులను అన్యులకెవ్వరికీ బదిలీ చేయకూడదని కాంట్రాక్టులో స్పష్టంగా నిబంధించాలి.

ఫార్వర్డు కాంట్రాక్టులు నిషేధించిన అనేక సందర్భాలలో, పైన చెప్పిన నిబంధనలను లెక్కచేయకుండా "బదిలీ చేయడానికి వీలులేని ప్రత్యేక బట్వాడా కాంట్రాక్టుల" పేరిట అనేకమంది వాయిదా వ్యాపారం సాగిస్తున్నట్లు కమిషనుకు తెలియవచ్చింది.

సరుకును కొన్నవారికి బట్వాడా చేయవలసిన అవసరం లేకుండా చేసే మధ్యవర్తులతో విడిగా కాంట్రాక్టులు కుదుర్చుకోవడం, గడువు కాలం తీరలోగా ఇతర కాంట్రాక్టులు వ్రాసుకోవడం వంటిచర్యలు అవలంభిస్తున్నారు.

పై విధంగా మారుపేర్లు పెట్టి అక్రమవ్యాపారం సాగించేట్టయితే, 1952 సంవత్సరపు ఫార్వర్డు కాంట్రాక్టుల (రెగ్యులేషను) చట్టం కింద అదీ న్యాయశాస్త్ర రీత్యా శిక్షార్హమైన నేరం అవుతుందనీ, ఇలాటి వ్యాపారంలో పాల్గొంటున్న సంస్థలలో వ్యక్తులకు కమిషను హెచ్చరిక చేస్తున్నాదు.

# వాణిజ్యపు పన్నులు

## అంచనాలకు మించి ఆదాయం

కర్నూలు, ఏప్రిల్ 17: అమ్మకం పన్నువల్ల 1955-56 ఫిబ్రవరి మాసాంతం వరకూ రూ 27719 వేలు వసూలైందని సహకార, వాణిజ్య పన్నుల మంత్రి శ్రీ డి. సంజీవయ్య చెప్పారు. గత సంవత్సరం యిదే కాలంలో వసూలైన అమ్మకం పన్నుకంటే యిది రూ1835 వేలు అధికం.

బడ్జెట్ అంచనా - 280 లక్షలు ప్రస్తుత ఆదాయం నూటికి 99 వంతులు ఉన్నది.

పొగాకు అమ్మకం, రిజిస్ట్రేషన్ ద్వారా లభించిన ఆదాయం, వినోదపు పన్నువల్ల వచ్చిన ఆదాయం బడ్జెట్ అంచనాలను అధిగమించాయి. మోటారు స్పిరిటు మీద విధించిన పన్నుద్వారా అంచనాలో నూటికి 84.51 వంతులు వసూలైంది.

పొగాకు అమ్మకం, రిజిస్ట్రేషన్ మీద విధించినపన్నులవల్ల యీ సంవత్సరం ఫిబ్రవరి ఆఖరువరకూ రూ. 802 వేలు వచ్చింది. బడ్జెట్ అంచనా రూ. 754 వేలు.

మోటారు స్పిరిట్ విషయంలో బడ్జెట్ అంచనా 51 లక్షలు అయితే వసూలైన మొత్తం రూ. 4310 వేలు.

వినోదపుపన్నుద్వారా యీ సంవత్సరం ఫిబ్రవరి ఆఖరువరకూ రు. 4166 వేలు లభించింది. బడ్జెట్ అంచనా 38 లక్షల రూపాయలు.

## గంటల పంచాంగం

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర శు॥ నవమి 1956- సం॥ ఏప్రిల్ 19 గురువారం శు॥ నవమి 12-54 ఆశ్లే రా 0-8 వర్జ్యం 13-30 ల 15-1 కు.
శు॥ దశమి ఏప్రిల్ 20 శుక్రవారం శు॥ దశమి 12.3 ము ఘా 23-7 వర్జ్యం 11-37 ల 13-9 కు.

ఆంధ్రపత్రిక

ఒరు లేదుని యెవరించిన
బరవర యుత్రియము తన మనంబున కగు దా
వొరులకు నవి సేయమికి
పరాయణము పరమధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర శు॥ నవమి
గురువారం

## సాహిత్య పరిషత్తు

తెలుగు భాష మాధుర్యాన్ని రుచి చూసి మురిసిపోతాము; తెలుగు సాహిత్య ఔన్నత్యాన్ని, ఘనతను తలపోసి ముగ్ధులమవుతాము. దేశంలో దాదాపు నాలుగుకోట్ల మంది ప్రజలు తెలుగుభాష మాట్లాడుతున్నందుకు హృదయపూర్వకంగా గర్వపడతాము. ఇది కేవలం ఆత్మస్తుతివల్ల కలుగుతున్న సంతృప్తి మాత్రమే.

తెలుగు భాష మాట్లాడే ప్రజలు నిన్న మొన్నటివరకూ తెలుగువారిగా చలామణీ కాలేదు. చెన్న రాష్ట్రంలో చేరివున్న తెలుగుప్రజలు మద్రాసీలైనట్లుగానే, హైదరాబాద్‌లో చేరివున్న తెలుగువారు హైదరాబాదీలైనారు. ఈ విధంగా రాన్ని శతాబ్దుల పాటు తెలుగు ప్రజలు తమ సహజ వ్యక్తిత్వాన్నే కోల్పోవడం జరిగింది.

స్వయంకృషి వల్ల ఒక రాష్ట్రాన్ని సాధించడంద్వారా తెలుగు ప్రజలు కోల్పోయిన ఆ వ్యక్తిత్వాన్ని తిరిగి స్థాపించుకోగలిగారు. సమగ్రాంధ్ర రాష్ట్ర అవతరణతో అచిరకాలంలోనే ఈ వ్యక్తిత్వానికి ఒక సంపూర్ణత్వం సిద్ధించబోతున్నది. సరిహద్దులలో మిగిలిపోయే సోదరులుతప్ప, తెలుగు ప్రజలందరూ ఏక పరిపాలనా వ్యవస్థ క్రిందకి రాబోతున్నారు. సువిశాలమైన నూతన రాష్ట్ర స్థాపనతో ఆంధ్ర ప్రజానీకానికి సంబంధించినంత వరకు ఆందోళన యుగం సమాప్తమవుతుందన్నమాట. ఇక మన కర్తవ్యం నూతన రాష్ట్ర సర్వతోముఖ అభివృద్ధికి కృషి చేయడమే. ఇది ఆర్థిక, సాంఘిక, సారస్వత, కళాభ్యుదయానికి సంబంధించిన వివిధ రంగాలలో సాగవలసిన కృషి.

ఇప్పటివరకూ, ఆంధ్ర రాజకీయ రంగాన్ని పీడించిన బహుళ వ్యవస్థాదోషమే బహుళ నాయకత్వ దౌర్బల్యమే ఆంధ్ర సారస్వత రంగానికి కూడా సంప్రాప్తమైంది. అన్ని విషయాలలో మాదిరిగానే, సాహితీ విషయంలో కూడా కలిసికట్టుగా వ్యవహరించ లేక పోయినాము. ఎక్కడికక్కడే ఒక సాహిత్య పరిషత్తు, ఒక సాహితీ సమితి, ఒక భాషా సమాజం, ఒక రచయితల సంఘం మొదలైనవి అనేక సంస్థలు నెలకొని ఏదో ఒక ప్రత్యేక ప్రయోజనం కోసం దేనికదిగా పనిచేయడం మొదలు పెట్టినవి. వీటిలో కొన్ని కేవలం 'ఏకవ్యక్తి వ్యవస్థలు' కూడా కావడం చేత, ఏ ఒకటీ కూడా యావదాంధ్ర ప్రజలకు ప్రాతినిధ్యం వహించలేక పోయింది. ఇది వాస్తవంగా విచారకరమైన విషయమే.

ఇన్ని సంస్థలు, సంఘాలు వున్న కారణంచేతనే, సాటి భాషలలో మన భాషకు సముచితమైన స్థానంలభ్యంకాకుండా పోతున్నది; సహజ సిద్ధంగా దానికి వుండవలసిన గౌరవం లేకుండాపోతున్నది.

ఇప్పటివరకూ జరిగిన ఈ స్వయం కృతాపరాధాన్ని ఇక మీదనైనా సరిదిద్దుకో వలసిన బాధ్యత తెలుగు సాహితీ పరులందరి మీదా వున్నది. తెలుగు భాషా వికాసానికీ, తెలుగు సాహిత్యాభివృద్ధికీ కృషి చేసే ఒకేఒక వ్యవస్థ వుండడం ఎంత అవసరమో నూతన రాష్ట్రనిర్మాణంతో మరీ ప్రస్ఫుటమవుతుంది.

కొన్ని సంవత్సరాల క్రిందట ఉగాదినాడు హైదరాబాద్ నగరంలో జరిగిన తెలుగుసాహిత్య గోష్ఠిలో ముఖ్యమంత్రి రామకృష్ణరావుగారు సరిగ్గా ఇదే హితవు చెప్పారు. హైదరాబాద్ రాజధానిగా ఒక విశాలమైన రాష్ట్రంలో ఆంధ్రులందరం చేరిపోతున్నాము కాబట్టి మన సాహితీ వికాసానికీ, ఉత్తమ సంప్రదాయాల పరిరక్షణకు ఒకే ఒక తెలుగు సాహిత్య పరిషత్తును ఏర్పాటు చేసుకోవాలని రామకృష్ణరావుగారు ఇచ్చిన సలహా ఆంధ్ర సాహితీ పరులందరికీ ఆవశ్యం శిరోధార్యమైనట్టిది. తెలుగుభాష గౌరవ ప్రతిష్ఠలను కాపాడుకోడానికి ఇలాంటి సంస్థ ఎంతైనా అవసరం.

ప్రాంతీయ భాషల వికాసాభ్యుదయాలను సర్వ విధాలా ప్రోత్సహించడానికి భారత ప్రభుత్వం కృషి చేస్తున్న విషయం సాహితీ ప్రియులందరికీ తెలిసిందే. మన రాష్ట్రంలో అనేక సాహిత్య సంస్థలున్న కారణంచేత ఏసంస్థతో వ్యవహరిస్తే యావదాంధ్ర ప్రాతినిధ్యం లభ్యమవుతుందో ప్రభుత్వానికే తెలియని క్లిష్టస్థితి ఒకటి ఏర్పడివున్నది. సాధ్యమైనంతత్వరలో మనం ఈ పరిస్థితికి స్వస్తి చెప్పి, తెలుగురాష్ట్ర మంతకూ ప్రాతినిధ్యం వహించే ఏకసాహిత్య సంస్థను ఏర్పాటు చేసుకోవాలి.

హైదరాబాద్ ముఖ్యమంత్రి స్వయంగా శ్రద్ధవహించి ఉగాది దిన శుభాకాంక్షగా సోదరాంధ్రులకు ఈ సలహా ఇవ్వడం ముదావహమైన విషయం. నూతన రాష్ట్రంతోపాటే నూతన సాహిత్యపరిషత్తు కూడా అవతరించేట్లు చేయవలసిన బాధ్యత సాహితీపరులదై వున్నది. దీనికి ప్రాతిపదికగా ఈలోగానే వివిధాంధ్ర సాహిత్య, వైజ్ఞానిక వేత్తల మహాసభ నొకదాన్ని ఏర్పాటు చేసి సాహిత్య పరిషత్తు స్థాపనకు అవసరమైన కార్యక్రమాన్ని నిర్ణయించుకోవడం సమంజసంగా వుంటుంది.

## సంపద ఖర్చులపై పన్ను 'వేస్తాం'

1 వ పేజీ 8 వ కాలం తరువాయి

ఫలించే ఆశ శూన్యమనీ కొందరు సభ్యులు చేసిన విమర్శలను శ్రీ దేశ్‌ముఖ్ ఖండించారు. అంచనాల పద్ధతి మన దేశంలో సక్రమంగా లేనిమాట నిజమే అయినా, మొదటి ప్రణాళిక వల్ల జాతీయాదాయం 18%, వ్యక్తిగత ఆర్జన 11% పెరిగాయని అంచనాలు వేశారు. కాబట్టి ఫలించలేదనే విమర్శ అన్యాయం అన్నారు. ఈ ప్రణాళిక కొందరికి లాభించి కొందరికి లాభించకపోయిన మాట నిజమే కావచ్చునేమో కాని, ప్రజాసామాన్యానికి బొత్తిగా ఏ ఫలితం దక్కలేదనే విమర్శ తప్పన్నారు.

వ్యక్తిగత ఆర్జనల్లో వ్యత్యాసాలు ఇంకా ఎక్కువగానే ఉన్నప్పటికీ, పూర్వంకంటె కొంత తగ్గినమాట నిజం. ఇంకా తగ్గించడానికి భూసంస్కరణలు, ఆర్థిక చర్యలు ప్రభుత్వం త్వరలోనే అమలుజరప దలుచుకుంది అని శ్రీ దేశ్‌ముఖ్ చెప్పారు.

భూ సంస్కరణల్లో ఇంతవరకూ జాప్యం జరిగినమాట నిజమే కాని, ఇంకా చురుగ్గా అమలు జరపగలరన్నారు.

కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాల కోసం ఏటేటా మొత్తం రు 800 కోట్లు ఖర్చు పెడుతున్నారు. ఈ ఖర్చులో యాభై అరవైకోట్లు తగ్గించవచ్చని శ్రీ మోహన్‌లాల్ సక్సేనా సూచించారు. కాని ఇది సాధ్యంకాదని శ్రీ దేశ్‌ముఖ్ చెప్పారు. ప్రణాళికా సంఘం ఈ తగ్గింపుకి ఒప్పుకోలేదు.

వృద్ధిచెందుతున్న ఆర్థిక వ్యవస్థలో ఖర్చులు తగ్గించుకోవడం జరిగేపని కాదన్నారు. ఖర్చుల్లోకల్లా దేశరక్షణ, శరణార్థుల పునరావాసం, ఋణాల నిమిత్తం వ్యయం కొనుబడి మొదలైనవి. పెద్దవి ఇవితగ్గించడం అసాధ్యం. ఇంక పోతే చిన్న పద్దుల్లో ఎంత తగ్గిస్తే మొత్తం ఎంతకి తగ్గుతుంది?

పన్నులు ఎగ్గొట్టేవారిదగ్గర ప్రభుత్వం వసూలుచేయ్యలేక పోతోందని కొందరు విమర్శించారు. ఏటేటా వసూలుకాని పన్నుల మొత్తం రూ. 30 కోట్లు అని ఒక నిపుణుడు అంచనా వేశాడు. ఇందులో రూ. 10 కోట్లు రూ. 4200 సాలు జీతం దరిదాపుల్లో ఉన్న వారు ఎగ్గొట్టుతున్న మొత్తం. మిగిలిందీ పెద్ద ఆర్జనపరులు ఎగవేస్తున్నది.

పన్నులద్వారా ప్రభుత్వాదాయం పెంచుకొంటూ పోతున్నప్పుడు, ఈ అదనపుభారం ఎవరిపైన పడుతోందనే వివాదంఉంది. కొందరికి చాలవరకు పేద ప్రజలపైనే పడుతోందంటున్నారు. ఇందులో కొంతవరకూ నిజం ఉంది. నూరింట ఒక్కమనిషికి కూడా రూ. 4200 సాలు ఆదాయంలేని ఈ దేశంలో ఇది తప్పదన్నారు. అయితే ప్రభుత్వం ధనికుల్ని ఎంతమాత్రం విడిచిపెట్టలేదన్నారు.

రెండో ప్రణాళిక అమలు జరిపే ఈ అయిదేళ్ళలోనూ ప్రభుత్వం పన్నుల వల్ల ఆదాయం పెంచుకోక తప్పదు. ఈ సంవత్సరం మొత్తం సంపద, ఖర్చులపై పన్నులు విధించలేదుకదా అని, ఇంక ఈ అయిదేళ్ళలో ఈ పన్నులు విధించదనే ధరోసాతో ఎవ్వరూ ఉండడం మంచిదికాదని శ్రీ దేశ్‌ముఖ్ హెచ్చరించారు.

పరోక్ష పన్నులవల్ల భారంఅంతా పేదలపైనే పడుతోందనే విమర్శ సరికాదన్నారు. పెద్దపరిశ్రమల పోటీనుంచి చిన్న చిన్న ఉత్పత్తిదారుల్ని రక్షించడంకోసం క్రమక్రమంగా ఎక్సైజు పన్నుల పద్ధతిని ప్రభుత్వం వినియోగిస్తోందని శ్రీ దేశ్‌ముఖ్ చెప్పారు.

తరవాత ఆర్థికశాఖ పద్దుని లోక్ సభ ఆమోదించింది.

# పశ్చిమాసియాలో శాంతిస్థాపన

## రష్యా కృషి చేస్తుందని ప్రకటన

మాస్కో, ఏప్రిల్ 17: అరబ్ రాజ్యాలకూ, ఇస్రేల్‌కూమధ్య శాంతిని కాపాడేందుకు ఐక్యరాజ్యసమితి తీసుకునే చర్యలకు సోవియట్ యూనియన్ అవసరమయిన సహాయం చేస్తుందని సోవియట్ ప్రభుత్వం నేడొక ప్రకటనలో తెలియజేసింది. పశ్చిమాసియాలో ఇంకా తేలకుండాఉన్న సమస్యలను శాంతియుతంగా పరిష్కరించేందుకు ఇతర ప్రభుత్వాలతో కలిసి పనిచేసేందుకు తాను సిద్ధమని సోవియట్ ప్రభుత్వం ఆ ప్రకటనలో తెలియజేసింది. అరబ్-ఇస్రేల్ సరిహద్దు పరిస్థితులను విషమింపజేసే చర్యలకు దిగవద్దని పశ్చిమాసియా దేశాలకు విజ్ఞప్తి చేసింది.

సోవియట్ నాయకులు లండన్ వెడుతున్న సందర్భంలో ఈ ప్రకటన చేయటంలో రష్యా ఉద్దేశం పశ్చిమాసియా పరిస్థితిని విషమించకుండా నివారించటమేనని ఇక్కడ భావిస్తున్నారు. ఈ ప్రకటన సోవియట్ నాయకులు బ్రిటిష్ ప్రధానితో జరిపే సంప్రదింపులకు ప్రాతిపదికగా ఉండే అవకాశం ఉన్నదని విదేశాంగమంత్రి శ్రీ మొలటోవ్ నేడు మాస్కోలో విలేఖరులు ప్రశ్నించగా సూచించారు.

సోవియట్ ప్రభుత్వ ప్రకటనలో ఈక్రింది అంశాలు ఉన్నవి: 1. పాలస్తీనా ప్రాంతంలో శాంతిని బలపరిచేందుకు మార్గాలన్వేషించటంలో ఐక్యరాజ్య సమితికీ, ఈ విషయమై చేసిన నిర్ణయాలను అమలు జరపటంలో భద్రతా మండలికీ కావలసిన సహాయాన్ని సోవియట్ యూనియన్ చేస్తుంది. 2. పశ్చిమాసియా ప్రజల ఇష్టాలకూ, సమితి ఆశయాలకూ విరుద్ధంగా బయటివాళ్లెవరూ పాలస్తీనా ప్రాంతంలో జోక్యం కలిగించుకోరాదని, అక్కడ వైరుధ్యాన్ని తగ్గించేందుకు చర్యలు అవసరమనీ సోవియట్ యూనియన్ భావిస్తున్నది. 3. ప్రస్తుత యుద్ధ విరమణ సరిహద్దుల వెంట పరిస్థితులని విషమింపజేసే చర్యలు తీసుకోవద్దని ఆ ప్రాంత దేశాలకు సోవియట్ యూనియన్ విజ్ఞప్తి చేస్తున్నది. 4. ఇళ్లనూ, జీవనోపాధులనూ పోగొట్టుకున్న లక్షలాది అరబ్ కాందిశీకుల పరిస్థితిని బాగుచేసేందుకు చర్య తీసుకోవలసిందిగా సోవియట్ ప్రభుత్వం విజ్ఞప్తి చేస్తున్నది. 5. ఉభయ పక్షాల న్యాయమయిన ఆశయాలకు అనుగుణంగా, పాలస్తీనా సమస్యను శాశ్వతంగా పరిష్కరించటం అంతర్జాతీయ శాంతి భద్రతలకు అవసరం. శాంతియుత పరిష్కారానికి సోవియట్ యూనియన్ ఇతర దేశాలతో సహకరిస్తుంది.

## సమితిద్వారా పని చేయూ అని శ్రీ డలెస్ భావం

"అరబ్—ఇస్రేల్ సంఘర్షణను నివారించి శాంతిని నెలకొల్పేందుకు 1950లో అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు చేసిన సంయుక్త ప్రకటన ద్వారా వ్యవహరించటం కన్నా ఐక్యరాజ్య సమితి ద్వారా వ్యవహరించటం మేలు" అని అమెరికా విదేశాంగ మంత్రి శ్రీ డలెస్ నేడు వాషింగ్టన్‌లో విలేఖరుల గోష్ఠిలో సూచించారు.

ఈ ప్రాంతంలో దురాక్రమణ నివారణకు సోవియట్ సహకారాన్ని అమెరికా కోరుతుందని అన్నారు.

(1950 లో అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు చేసిన సంయుక్త ప్రకటనలో తాము పశ్చిమాసియాలో యుద్ధాన్ని నివారించేందుకు సమితి ద్వారానూ, ఇతరత్రా కూడా చర్య తీసుకుంటామని ఉద్ఘాటించినవి)

అట్లాంటిక్ మండలి వచ్చే నెల సమావేశమయేలోపు ముందు మూడు పశ్చిమ రాజ్యాలు సమావేశమై పశ్చిమాసియాపై చర్చించాలని ఫ్రాన్స్ చేసిన ప్రతిపాదనను బ్రిటన్ నేడు సుముఖత వెల్లడించింది.

అయితే వాషింగ్టన్ వర్గాలు మాత్రం అమెరికా ఈ సమావేశాన్ని ప్రతిఘటిస్తున్నదనీ, పశ్చిమ రాజ్యాల సమావేశం వల్ల ఇప్పుడు లాభంలేదని అన్నదనీ తెలియజేస్తున్నారు.

## కార్మికకాంగ్రెసు ఎన్నికలు

సూర్యాపేట, ఏప్రిల్ 15: గాంధీ భవనంలో శ్రీ అనిరెడ్డి వెంకటరెడ్డి అధ్యక్షతన అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఎన్నికలు జరిగాయి.

శ్రీ బి. రమణారెడ్డి అధ్యక్షులుగా శ్రీ గాలి రామనర్సయ్య కార్యదర్శిగా మరి 21 మంది కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైనారు.

## కేంద్రపన్నులసవరణ

1 వ పేజీ 8 వ కాలం తరువాయి

టాన్ను)—ఈ సందర్భంలో అకౌంటెంట్‌ చెల్లించిన రాబడిపన్ను మొత్తం ఎంతుంటుందో, అంత మొత్తాన్నీ మినహాయించి మరీ అధికసుంకం విధిస్తారు. దీని వల్ల న్యాయవాదుల సంస్థలు, ఎకౌంటెంట్ల సంస్థలవంటి వానిపన్ను లభారం కొంత తగ్గుతుంది.

ఎక్సైజ్ పన్నుల విషయంలో తమ ప్రతిపాదనలను ఆర్థికమంత్రి సమర్థించుకున్నారు. వీనిని లఘుపరిశ్రమలను సంరక్షించే విధంగా విధిస్తున్నారనీ, చిన్న చిన్న పరిశ్రమల కసలీ భారం తగలదనీ చెప్పారు.

## రాష్ట్రాల బిల్లు

### లోక్‌సభలో ప్రతిపాదన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: రాష్ట్రాల పునర్నిర్మాణం బిల్లును నేడు లోక్ సభలో హోంమంత్రి పండితపంత్ ప్రతిపాదించారు. బీహార్, బెంగాల్‌ల విషయమై ఇప్పుడు సంప్రదింపులు జరుగుతున్నవనీ, ఆ విషయమై తరవాత వేరే ఒక బిల్లు విడిగా ప్రతిపాదించబడుతుందనీ ఆయన తెలియజేశారు.

ఈ బిల్లు మార్చి 16 వ తేదీన ప్రతిపాదించిన ముసాయిదామాదిరిగే ఉన్నదనీ, మార్పులేమీలేవనీ పండితపంత్ శ్రీ కమల్ బోస్ సందేహాలకు జవాబిచ్చారు. బెంగాల్ - బీహార్ బిల్లును ప్రస్తుతసమావేశంలోనే ప్రతిపాదించాలని తమ ఉద్దేశమనీ, అయితే దానిమీద హామీ ఇవ్వలేననీ శ్రీ పంత్ వివరించారు.

రాష్ట్రాల పునర్నిర్మాణ బిల్లు ప్రకారం తిరువాన్కూర్ - కొచిన్ రాష్ట్ర సరిహద్దులు మార్చబడతాయనీ, ఆ విషయమై ఆ రాష్ట్రశాసన సభతో సంప్రదించలేదు కనుక, ఈ బిల్లుమీద చర్చించ వీలులేదనీ వాదించి చర్చను వాయిదా వేయించేందుకు మలబార్ సభ్యుడు శ్రీ క. కేలప్పన్ ఒక ప్రయత్నం చేశారు. కాని అది విఫలమయింది.

ఈ బిల్లుమీద చర్చకు మూడు రోజులను సభాకార్యక్రమ నిర్ణయసంఘం కేటాయించింది. దీనిని శ్రీ హెచ్. వి. కామత్ ప్రభృతులు ప్రతిఘటించారు.

శ్రీ కామత్ ఈ బిల్లుమీద చర్చకు 5 రోజులు కేటాయించాలని అన్నారు. ఈ బిల్లుమీద హడావుడిగా చర్చ జరిపించి, ఏదో విధంగా అయిందనిపించాలని ప్రయత్నించరాదని ఆయన అన్నారు. ఈ సారి ఉదయమే వివిధ కట్టలు సభ్యులకు అందినవనీ, ఇంత స్వల్ప వ్యవధిలో చర్చకు సిద్ధపడటం కష్టమనీ అన్నారు.

దేశీయాంగమంత్రి జవాబిస్తూ సభా కార్యక్రమ నిర్ణయసంఘంలో అన్ని పక్షాల ప్రతినిధులూ ఉండి, మూడు రోజులను కేటాయించారు కనుక, దానికి సభ్యులు ఆమోదించాలని విజ్ఞప్తి చేశారు. ఇదివరకొకసారి ఈవిషయమై పెద్దచర్చ జరిగియున్నదనీ, ఇప్పుడు ఈ బిల్లును పరిశీలకసంఘానికి ఉపహరించ నిశ్చయమయింది కనుక, మళ్ళీ చర్చకు వస్తుందనీ అన్నారు.

# ప్రపంచ న్యాయస్థానంలో పోర్చుగల్ ఫిర్యాదు

## విచారించే హక్కు లేదని భారత ప్రభుత్వం వాదిస్తుంది

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: భారత భూభాగంగుండా పోర్చుగల్ పాలిత ప్రాంతాలకు రాకపోకల సమస్యను విచారించే అధికారం అంతర్జాతీయ న్యాయసంస్థకు లేదని భారత ప్రభుత్వం వాదించగలదని ప్రధాని శ్రీ నెహ్రూ లోక్ సభలో తెలియజేశారు.

భారత భూభాగంగుండా గోవాకి రాకపోకలు సాగించేహక్కు తమకు ఉన్నదనీ, ఆ హక్కును భారత ప్రభుత్వం అమలు జరుపుకో నియ్యడం లేదనీ చెప్తూ పోర్చుగీసుప్రభుత్వం అంతర్జాతీయ న్యాయస్థానంలో ఇటీవల ఫిర్యాదు తెచ్చింది.

ఈ ఫిర్యాదుకు సంబంధించిన విజ్ఞప్తి పత్రాన్ని 1956 జూన్ 15 లోగా దాఖలు చేసుకోవలసిందని పోర్చుగీసు ప్రభుత్వానికీ, దానికి ప్రతివాదం డిసెంబరు 15 లోగా దాఖలు చేసుకోవలసిందని భారతప్రభుత్వానికీ అంతర్జాతీయ న్యాయస్థానం ఆదేశాలిచ్చింది.

ఈ విషయమై లోక్ సభలో ప్రశ్నలకు జవాబిస్తూ ప్రధాని నెహ్రూ అసలీ సమస్యను విచారించే హక్కు ఆ న్యాయసంస్థకులేదని భారత ప్రభుత్వం వాదిస్తుందని తెలిపారు.

1779 వ సంవత్సరంలో మహ్రాట్లతో చేసుకున్న పాత ఒడంబడిక ఆధారంగా పోర్చుగల్ ఈ హక్కు ఉరస్కరించుకుని వాదిస్తున్నట్లు తమకు జ్ఞాపకం అని శ్రీ నెహ్రూ అన్నారు.

అంతర్జాతీయ వివాదాలన్నిటినీ విచారించే అధికారం ఈ న్యాయసంస్థకు ఉన్నదంటూ 1940 లో భారతప్రభుత్వం ప్రకటించిన మాట నిజమే నన్నారు. అయితే ఆ అభిప్రాయం మార్చుకుని, అంతరంగిక వ్యవహారాలకు సంబంధించి నంతవరకూ, వానిని అంతర్జాతీయ వివాదాలుగా విచారించే అధికారం లేదని భారతప్రభుత్వం ఈ సంవత్సరారంభంలో (జనవరి నెలలో) మరో ప్రకటన చేసింది. ఈ ప్రకటనల వైరుధ్యంవల్ల పరిణామాలేమిటో ఆ విషయాలన్నిటినీ న్యాయస్థానంలో వాదించవలసింటేటని శ్రీ నెహ్రూ అన్నారు.

న్యాయస్థానానికి విచారించే అధికారంలేదని అక్కడ వేరే వాదించవలసిన అవసరమేమిటని శ్రీ క. క. భాసు ప్రశ్నించారు. న్యాయశాస్త్రం మొదలైన ఆటువంటి క్లిష్టమైన అంశాలను ప్రస్తుతం వివరించలేనని శ్రీ నెహ్రూ జవాబిచ్చారు.

### పాక్, భారత న్యాయమూర్తులు

ఈ ఫిర్యాదు విచారించే సమయంలో పాకిస్తాన్ దేశం తరఫు న్యాయమూర్తి విచారణలో పాల్గొనకుండా కోరాలని ఒకరు సూచించారు. ఆ విషయం ఇక్కడ తేమీ చెప్పలేనని శ్రీ నెహ్రూ అన్నారు.

న్యాయస్థానం నిబంధనల ప్రకారం భారతదేశంకూడా భారత న్యాయమూర్తి ఒకరిని ఆ సమయానికి నియమించే హక్కు ఉన్నదనీ, ఆ హక్కు వినియోగించుకునే అవకాశం లేకపోలేదనీ మంత్రి శ్రీ కృష్ణమీనన్ చెప్పారు.

ప్రస్తుతం అంతర్జాతీయ న్యాయస్థానంలో ఇద్దరే న్యాయమూర్తులు ఆసియాకు చెందిన వారున్నారనీ, వారు పాకిస్తాన్, జపాన్‌లకు చెందినవారనీ శ్రీ మీనన్ చెప్పారు

## లంకనుంచి బ్రిటిష్‌సేనకు స్వస్తి

1వ పేజీ 5 వ కాలం తరువాయి

స్థావరాలు సత్వరత్వంవల్ల అట్టే ఉపయోగం లేదు. ఈ రోజుల్లో స్థావరాలు సత్వరత్వంకన్నా ప్రాంతీయదేశాలతో సంబంధాలు ఎక్కువ ముఖ్యం.

### నెహ్రూ విధానంతో ఏకీభావం

ముఖ్యమైన తటస్థ విధానం విషయమై భారతప్రధాని శ్రీ నెహ్రూ విదేశాంగ విధానాలతో ఏకీభవిస్తాను. ఏవిజాతిసామంతులకు లోనుకాకుండా తటస్థంగా ఉండటమే ఆ విధానం. ఐతే శ్రీ నెహ్రూగారివలె నేను కమ్యూనిజంలో ప్రమాదాన్ని తిరస్కరించలేను, పరిస్థితులను బట్టి మారగల వైఖరి నవలంబిస్తూనే దేశంనుంచి వెళ్ళిపోతాం టాను.

### కమ్యూనిజం భవిష్యత్తు

కమ్యూనిజం ఇంకా విస్తరిస్తూనే ఉంటుంది. అయితే విస్తరణ వేగం కొంత తగ్గుతుంది. మరి 25 సం॥ పాటు యుద్ధంలేకుండా ఉంటే, ఇప్పుడిప్పుడే జరుగుతున్నట్లుగా, కమ్యూనిజంలో ఉన్న అతివాదధోరణులు నశించిపోతవని నా నమ్మకం. అప్పుడు మిగిలిన దేశాలుకూడా ఇటువైపుకు రావటం మొదలు పెడతవి. దానితో ఒక మధ్యరకపు వాదం ఏర్పడుతుంది. అది ఒకరకమయిన ప్రజాస్వామిక సోషలిజం రూపం పొందవచ్చును.

ప్రపంచమంతా కమ్యూనిజం కావాలంటే, నేను వద్దను. అయితే అది జరుగుతుందనుకోను. కమ్యూనిజం క్రమక్రమంగా తన తీవ్రతను పోగొట్టుకుంటుంది.

### చైనా, రష్యాలతో మైత్రి

సింహళంలో కమ్యూనిస్టు విప్లవ భయంలేదు. చైనా, సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ రాజ్యాలతో రాయబార సంబంధాలు ఏర్పరచుకోవాలి. ప్రపంచ దేశాలన్నీ తిరిగి చూడాలని నా ఉద్దేశం. సోవియట్ నాయకులు బుల్గానిన్, క్రుశ్చేవ్‌లు సింహళం వస్తే సంతోషిస్తాను. భారత ప్రధాని నెహ్రూతో కలిసి పంచశీలాలను సమర్థిస్తూ ప్రకటన చేయటంలో సోవియట్ నాయకులు శాంతి సాధనకు ఒక సబబయిన మార్గానికి అంగీకరించినవాళ్ళయినారు.

### వాణిజ్య నిర్బంధాలు పోవాలి

యుద్ధం రాకుండా నివారించటం అవసరం. ఇది సాధ్యపడాలంటే వాణిజ్య నిర్బంధాలను తొలగించి, తూర్పు పశ్చిమ రాజ్యాల మధ్య వ్యాపారం పెంపొందటం, ఉభయ వర్గాలమధ్య సంబంధాలు పెరగటం, ఉభయులూ ఆతిజాగ్రాన్ని తగ్గించుకోవటం అవసరం.

సింహళానికి ఆర్థికసహాయం చేస్తామని అమెరికా చేసిన ప్రతిపాదనను పరిశీలిస్తాను. ఏ దేశం సహాయంచేసినా తీసుకుంటాము. అయితే వాటికి ఎటువంటి షరతులూ ఉండరాదు. జీతం మీద వచ్చి పనిచేసేట్లయితే, సింహళం అభివృద్ధి పథకాలకు సోవియట్ నిపుణులు రావటం కూడా నాకు సమ్మతమే"

### సింహళానికి మౌంట్‌బాటన్ రాక

బ్రిటిష్ నావికా దళాధిపతి ఎడ్మిరల్ మౌంట్ బాటన్ ప్రాచ్య దేశాల్లో బ్రిటిష్ స్థావరాలను పరిశీలిస్తూ శిఘ్ర కొలంబో వస్తున్నారు. ఈయన సింహళంలో బ్రిటిష్ నావికా స్థావరాన్ని ట్రింకోమలై దగ్గర చూస్తారు.

ఈయన ప్రధాని బండారనాయకను కలుసుకుంటారు. ఈసమావేశంలో బ్రిటిష్ స్థావరాల రద్దు విషయం సూచించబడుతుందనీ, జూన్‌లో జరిగే కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో ఈ విషయాన్ని శ్రీ బండారనాయకే గట్టిగా చర్చిస్తారనీ కొలంబోలో రాజకీయ వర్గాలు భావిస్తున్నారు.

# భారత సింహళాల సహకారం

## ప్రపంచ సమస్యల్లో: ఉభయ ప్రధానుల ఏకీభావం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 17: ఉభయదేశాలకూ సంబంధించిన సమస్యలను పరిష్కరించటంలోనూ, అంతర్జాతీయ వ్యవహారాల్లోనూ కూడా భారత సింహళాలు సహకరించగలవని భారత ప్రధాని పంపిన సందేశంతో ఏకీభవిస్తూ సింహళ నూతనప్రధాని శ్రీ బండారనాయకె నేడు శ్రీ నెహ్రూకు సందేశం పంపారు.

తన పదవీస్వీకార సమయంలో శ్రీ నెహ్రూ పంపిన అభినందనలకు శ్రీ బండారనాయక కృతజ్ఞత తెలిపారు.

### చైనా, వియత్నాంల సందేశాలు

కొలంబో, ఏప్రిల్ 17: చైనా ప్రధాని శ్రీ చౌఎన్‌లే, ఉత్తర వియత్నాం రిపబ్లిక్ ప్రధాని శ్రీ ఫాంవాన్ దూంగ్ శ్రీ బండారనాయక సింహళ ప్రధాని పదవి అధిష్ఠించినందుకు అభినందిస్తూ సందేశాలు పంపించారు.

శ్రీ చౌఎన్‌లే తన సందేశంలో ఉభయదేశాలకూ ప్రాచీనకాలంనుంచీ స్నేహసంబంధాలు ఉన్నవనీ, పరస్పర సమానహోదాతో వ్యాపార సంబంధాలు నెలకొల్పబడినవనీ, స్నేహసంబంధాలు ఇంకా వృద్ధికాగలవని ఆశిస్తున్నాననీ తెలియజేశారు.

శ్రీ ఫాంవాన్‌దూంగ్ తన సందేశంలో ఉభయదేశాల మైత్రి బలపడి, శాంతికి దోహదం చేయగలదన్న ఆశను వెల్లడించారు. వీటికి యథోచిత సమాధానాలను శ్రీ బండారనాయకె పంపించారు.

ఏప్రిల్ 20 వ సింహళ కొత్త పార్లమెంటు సమావేశం ప్రారంభమవుతుంది. ఇంతవరకూ కామన్వెల్తులో సింహళం ఉంటున్నందుకు నిరసనగా సమసమాజ్ పార్టీ కమ్యూనిస్టుపార్టీలు ప్రారంభ సమావేశాన్ని బహిష్కరిస్తూ వచ్చినవి. 20 వ తేదీ సమావేశానికి ఇవికూడా హాజరవుతున్నవి.

### మద్యనిషేధానికి నాంది

బ్రిటిష్ నావికాదళాధిపతి ఎడ్మిరల్ మౌంట్‌బాటన్ రేపు కొలంబోవచ్చినప్పుడు ఏర్పాటుచేసే సన్మానోత్సవమే శ్రీ బండారనాయక ప్రధాని అయిన తరవాత అధికారరీత్యా సాల్గొంటున్న మొదటి ఉత్సవం. ఇందులో, మద్యపానీయాలు ఉంచరాదని నిర్ణయమయింది.

ఇకముందు ప్రభుత్వం చేసే విందులన్నిటిలో నూకూడా మద్యపానీయాలు ఉండరాదని నిర్ణయమయింది.

# పశ్చిమ పాక్ ఎల్లల్లో భారత సైన్యాలు లేవు

కరాచీ, ఏప్రిల్ 17: పశ్చిమ పాకిస్తాన్ సరిహద్దు పొంబడి భారత ప్రభుత్వం సైన్యాలను మొహరించిందని, పాకిస్తాన్ చేసిన ఆరోపణ, అసత్యమని, భారత ప్రభుత్వం ఖండించింది.

# సైప్రస్‌పై అట్లాంటిక్ మండలి ధర్మకర్తృత్వం

## శ్రీ డలెస్ నిరాకరణ

వాషింగ్టన్, ఏప్రిల్ 17: సైప్రస్ దీవిపై బ్రిటన్, గ్రీసుల తగాదా తేలేవరకూ దానిని అట్లాంటిక్ మండలి ఆధ్వర్యంకింద ఉంచాలని వచ్చిన ప్రతిపాదనను అమెరికా విదేశాంగ మంత్రి శ్రీ డలెస్ నేడిక్కడ ఖండించారు. అట్లాంటిక్ మండలి అనేక దేశాలు కలిసి ఏర్పాటుచేసిన మండలేకాని, ఏకైక సంస్థ కానందువల్లనూ, మండలి నిర్ణయాలన్నీ సభ్యుల ఏకగ్రీవామోదం పొందవలసియున్నది కనుకనూ, మండలి పాలన సాధ్యపడదని ఆయన వివరించారు.

ఐక్యరాజ్యసమితి కూడా ధర్మకర్తృత్వాధికారాన్ని మరొక దేశానికి అప్పగిస్తున్నదేకాని, స్వయంగా పాలించటం లేదని ఆయన ఉదహరించారు.

### ఈడెన్ ఉద్ఘాటన

సైప్రస్‌లో శాంతిభద్రతలు నెలకొనేవరకూ అక్కడ సంప్రదింపులు జరిపే ప్రసక్తేరాదని బ్రిటిష్ ప్రధాని ఈడెన్ నేడు కామన్స్ సభలో ఉద్ఘాటించారు.

# కవికి సన్మానం చేస్తే ప్రయోజనమేమిటి?

## భీమవరం సభలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ప్రశ్న: కావ్యగానం

భీమవరం, ఏప్రిల్ 16: కోటి పరిస్థలలో పదవులలో ఉన్నవారికి, అధికారంగలవారికి పౌరసన్మానం చేస్తే కొంతమందిగాని తిరుమతి కవులను, గాయకులను సన్మానించే లాభమేమిటని స్థానిక పురపాలకసంఘం చేసిన పౌరసన్మానానికి సమాధానం చెప్తూ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ప్రశ్నించారు.

సన్మానానికి కృతజ్ఞతచెప్తూ శ్రీ సత్యనారాయణ తమ కావ్యాలనుంచి పద్యాలు చదివారు.

వర్తకసంఘంకూడా శ్రీ విశ్వనాథ సత్యనారాయణకు సన్మానం చేశారు. "కల్పవృక్షం" నుంచి కొన్ని పద్యాలను శ్రీ సత్యనారాయణ గానం చేశారు.

# హైదరాబాదు, సికిందరాబాద్ కార్పొరేషన్ల పనుల సమన్వయం

## ఉమ్మడి సంఘాన్ని వేసుకొని పొదుపు సాధించాలని మంత్రి సలహా

హైదరాబాదు, ఏప్రిలు 17: హైదరాబాదు, సికింద్రాబాదు నగర కార్పొరేషన్‌లను ఏకంచేసి, ఒక కార్పొరేషన్ యేర్పాటు చేయడం వెంటనే సాధ్యంగాకపోతే, కనీసం ఈ రెండు కార్పొరేషన్‌లు నిర్వహించే పనులను సమన్వయించి దుబారాఖర్చు లేకుండా సామర్థ్యం పెంచడం అవసరమని స్థానికసంస్థల పరిపాలనామంత్రి శ్రీ గోపాలరావు ఎక్బోటే సూచించారు.

ఇందుకు దృష్టాంతంగా ఆర్గ్రీ పీం జెన్‌ను ఉదహరించారు. అక్కడ ఒక కొంట్రాక్టుసంఘం 45 నగరాలలో నిఅస్తి విలువను లెక్కకట్టి, వాటిపై కార్పొరేషన్లకు పన్ను వసూలు చేసిపెడుతుందని, మరో 10నగరాలకు విద్యుత్ కొలపనులు చేసిపెడుతుందని ఆయన తెలియజేశారు. అలాగే కొన్నిరకాల పనుల నిర్వహణలో, హైదరాబాదు, సికిందరాబాదు నగరాల కార్పొరేషన్లు, ఉమ్మడిగా, ఒకసంఘాన్ని యేర్పాటు చేసుకోవచ్చని ఒక కంట్రాక్టుసంఘం కుదుర్చుకుని, తద్వారా పనులు చేసుకోవచ్చునని, ఆయన సలహా ఇచ్చారు.

ఇప్పటికన్నా విశాలమైన 'ఆంధ్ర ప్రదేశ్' రాష్ట్రానికి హైదరాబాదు రాజధాని అవుతుంది. గనుక, నగరం, నగరజనాభా పెరుగుతుంది. అంటే హైదరాబాదు, సికిందరాబాదుకార్పొరేషన్ల బాధ్యతలు కూడా పెరుగుతాయి. నగరాలను పరిశుభ్రంగా, ఆరోగ్యవంతంగా ఉంచుతామని అనే ప్రతిష్ఠ దక్కించుకోవాలంటే, యీ రెండు కార్పొరేషన్లు, విలీనంకావడం అవసరం. అది ఇప్పుడు సాధ్యకాదనుకుంటే నేను సూచించినట్లు, తమతమ పనులను సమన్వయం చేసుకునే విషయమైనా ఆలోచించాలిఅని శ్రీ ఎక్బోటే అన్నారు.

# ప్యారిస్‌లో రాయబారిగా గజన్‌ఫరాలీ నియామకం

లాహోరు, ఏప్రిల్ 18: భారతదేశంలో పాకిస్తాన్ హైకమీషనరుగా ఉంటున్న శ్రీ గజన్‌ఫరాలీ ఖాన్‌ను, పారిస్ రాయబారిగా పాకిస్తాన్ ప్రభుత్వం నియమించింది. నెల రోజుల్లో, ఆయన కొత్త ఉద్యోగం స్వీకరిస్తారు. పాకిస్తాన్ టైమ్సు (కరాచి) యీ వార్త యివాళ ప్రకటించింది.

